హాటకశైలప్రకాండశుభోదయకారకదివ్యనాముఁ డం
బాదయితుండు దృఙ్మహితఫాలుఁడు శ[illegible]ఁడు భక్తియుక్తికిన్.

427\. క. యోగీంద్రచిత్తకమలా
భోగమధుపవిభుఁడు ప్రకృతిపురుషాత్ముఁడు ని
రోగస్వరూపుఁ డవ్య
క్తాగోచరుఁ డధికసులభుఁ డమలాత్ముఁ డనన్.

428\. ఉ. నీలగళుండు శంకరుఁడు నిత్యుఁడు సర్వసురాఖ్యుఁ డుజ్జ్వల
త్కాలమహానలప్రశమకప్రచురామృత[1]వృష్టివిస్ఫుర
ద్బాలమృగాంకశేఖరుఁడు దైత్యకుల[2]ప్రవిదారణక్రియా
లోలపరశ్వథుండు [3]సకలుం డమలుండు ప్రియుండు శాంతికిన్.

429\. వ. అని ప్రశంసించి [1]కపర్ది గనినవాఁడు రుద్రుం డగుటఁ దేటపఱచి దక్షమఖమథనత్రిపురమర్దనాదు లగు నద్దేవునిదివ్యలీల లుపన్యసించి మహాదేవపశుపతిశివప్రముఖంబు లగు తదీయభవ్యనామంబులకుం బ్రవృత్తినిమిత్తంబు లగు నర్థంబులు దెలియ [2]నిర్వచనంబు సేసి యట్టిపరమేశ్వరుండు నీకు వరదుండయి సన్నిధి సేసె నతనిం గని పెన్నిధిఁ గన్న పేదపోలెం గృతార్థుండవై తయ్యంధకాసురభంజనుకతంబున గడిందిపగ అడంగుదు రయ్యాదిమ్మధీనుర్ధరుం డివ్విధంబున వైరివధం బాపాదింప నీకు గెలుపు గొనుట సుకరం బయ్యె నీతపంబు పెంపునం దొల్లి సన్నిహితుం డై నీకుం బ్రియంబుగా దివ్యాస్త్రంబు లొసంగె నంతటం దనివి సనక యుత్తెఱంగున భక్తపరాధీనత్వంబు ప్రకటించె నీవు [4]పుణ్యాత్ముండ వప్పరమాత్ము నాత్మ నిలిపి నమస్కరింపు మాసర్వలోకశరణ్యు శరణంబు సొరు మక్కరుణాకరుండు శరణా

428\. 1. దృష్టి - కొన్ని ప్రతులు. 2. ప్రళయాంతకక్రియా - ల. 3. కుశలుండు గలం డఘతాపశాంతికిన్ - స; డచలుం డమయుండు - ల.

429\. 1. కపర్దినే కనినవాడు రుద్రుం డని తేటపరచి - వ. వీ. శ. ష. 2. వ్యుత్పన్నంబులు సేసి - కొన్ని ప్రతులు. 3. మహావీరుండు - కొన్ని ప్రతులు. 4. మహాభాగుండ - శ.

గతులకు నాయురారోగ్యైశ్వర్యాదిసకలాభిమతంబులు నిత్యంబులుగాఁ బ్రసాదించు నని నిర్దేశించిన నయ్యర్జునుండు దండప్రణామపూర్వకంబుగా భక్తిరసాయత్తం బగుచిత్తంబునం [6]జంద్రధరు నెలకొలిపి సాంద్రానందం బనుభవించి సాత్యవతేయుచరణంబుల కెఱంగిన నమ్మునీంద్రుం డయ్యింద్ర నందను నభినందించి సుఖవి గమ్మని దీవించి విజయంచేసె నని యిట్లు సంజ యుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.

430\. క. మునివర ద్రోణుని[1]వృత్తము
విని సంతుష్టుండ నైతి విను వేడుక నా
మనమునఁ దోడ్తో నొదవెడు
వినిపింపు దగంగ మీఁదివృత్తాంతంబున్.

431\. వ. అని యడుగుటయు.

432\. చ. అమరకిరీటకోటి[1]కలితారుణరత్నమరీచివీచికా
సముదయఖేల[2]నోల్లసనచారుపదాంబుజకాంతిపూర దు
ర్దమ[3]దనుసూనుసంచయవిదారణ చిత్తవిహారబోధనా
గమహితనాదనిర్వహణకౌతుక[4]విశ్రుత రక్షితాశ్రితా.

433\. క. [1]జనవినుత బాదరాయణ
మునీంద్ర వాగమృతనిధిసముద్భూతాహ్లా
దనకీర్తిసుధాకిరణా
వినతాఖిలభద్రకరణ విశ్రుత[2]చరణా.

6\. నిందుధరు – కొన్ని ప్రతులు.

430\. 1 వర్తన – కొన్ని ప్రతులు.

432\. 1. ఘటితారుణ – బ. వ. 2. నోల్లసిత – వ. శ. ష. కొన్ని ప్రతులు. 3. దను జానుశాసన విధానత విత్తవిహార – స. 4. విశ్రుత – అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు; మిశ్రిత ఏ వా.

433\. 1. వినుతిపర – క. ఘ. హ; వినుతపద – కొన్ని ప్రతులు. 2. కరుణా – కొన్ని ప్రతులు.

434. మాలిని అమృతమయవిలాసా యాగ[1]భాస్వద్విలాసా
విమలహృదయరమ్యా [2]వీతరాగాదిగమ్యా
కమలభవనమస్యా గౌరవాధిక్య[3]శస్యా
శమదమపరివర్తీ శాశ్వతానందమూర్తీ.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య
పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం
బయిన శ్రీమదాంధ్ర మహాభారతంబున
ద్రోణపర్వంబునందు సర్వంబును
బంచమాశ్వాసము.

శ్రీమదాంధ్ర మహాభారతము నందలి ద్రోణపర్వము సంపూర్ణము



434. 1. భాస్వద్విలాసా – వ; భోగోద్వికాసా – వా. 2. విశ్రుతజ్ఞానశమ్యా – ఏ. ర. వేదసారానుగమ్యా – వ. 3. సేవ్యా – కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మ పర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

## ఈ



## ఉ

## ద

— (౦) —

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము

### గద్య పద్య ప్రథమ పాదసూచి

ఇ

## ఈ



## ఉ

# ద



# ధ

బ

## శ